వాసారసేనగగనం * కాసశ్వాసం దురావహమ్. 464
క్షయరోగహరం శీఘ్రి మశ్వగంధి విసర్పిషు,
మయూరపింఛక్షారేణ మధునా ఛర్దిలుంతనమ్. 465
కపిత్థఫలసారేణ హిక్కారుచిహరం పరం,
భల్లాతకేన గగన మర్శోరోగహరం పరమ్ 466
ముస్తా నాగరక్వాథేన సర్వాతీసారనాశనం,
ఇతి సాంగానుపానాభ్రం సర్వరోగహరం పరమ్. 467

తా. త్రిదోషములులేకుండు అభ్రకభస్మమును సేవించిన సర్వరోగములు హరించును. మఱియు అభ్రకభస్మమును పిప్పలి, పంచదార అనుపానితోడ సేవించిన వాతపిత్తజ్వరములును, నెయ్యి, కరుధూమము అనుపానితోడ సేవించిన చిప్పికాకాసమును, పంచసారములతోడ సేవించిన విషమజ్వరములును, చాతుర్జాతక చూర్ణానుపానముతోడ మూడు దినములు సేవించిన సన్నిపాత, వాత, రక్తపిత్తములును, అడ్డసరపాకురసముతో సేవించిన అసాధ్యమైన కాసశ్వాసములును, వెన్నెరుగడ్డమూర్ణముతో సేవించిన క్షయ, విసర్పిరోగములును, నెమలియీకెభస్మము, తేనె అనువానియనుపానముతోడ సేవించిన ఛర్దియు, వెలగగుజ్జుతో సేవించిన హిక్కారుచులును, జీడిగింజలకషాయముతో సేవించిన అర్శోరోగంబును, తుంగముస్తెలు శొంఠి అనువానికషాయముతో సేవించిన సర్వాతిసారములును హరించును. ఈయనుపానవిశేషములతోడ అభ్రకభస్మమును సేవించిన సర్వరోగములు నివర్తించును.

## రసాష్టాదశసంస్కారవివరణము

స్వేదనం మర్దనం మూర్ఛోత్థాపనం పాతనం త్రిధా,
బోధనం నియమంచైవ దీపనం చానువాసనమ్. 468
మారణం జారణంచైవ సారణం ప్రతిసారణం,
క్రామణం వేదనంచైవ దేహే యోగే చ శస్యతే. 469

తా. స్వేదనము, మర్దనము, మూర్ఛనము, ఉత్థాపనము, అధఃపాతనము, తిర్యక్పాతనము, ఊర్ధ్వపాతనము, బోధనము, నియమము, దీపనము, అనువాసనము, మారణము, జారణము, సారణము, ప్రతిసారణము, క్రామణము, వేదనము, శరీరయోగము అనునవి రసాష్టాదశసంస్కారంబులు.

## స్వేదనవిధి

త్ర్యూషణం లవణం రాజీ రజనీ త్రిఫలార్ద్రకం,
మహాబలా నాగబలా మేఘనాదః పునర్నవా. 704

---

* అర్శోరోగహరం పరమ్.

మేషశృంగీ చిత్రకం చ నవసారం సమంసమం,
రసస్య షోడశాంశేన సర్వాం యుంజ్యాత్పృథక్పృథక్. 471
ఏతత్సమస్తం వ్యస్తం వా పూర్వోక్తైశ్చైవ పేషయేత్,
లింపేదనేన కల్కేన వస్త్రే నాంగులిమాత్రకమ్. 472
తన్మధ్యే నిక్షిపేత్సూతం బధ్వా తత్ర దినం పచేత్,
డోలాయంత్రే ఽమ్లసంయుక్తే జాయతే స్వేదితో రసః. 473

తా. త్రికటుకములు, ఉప్పు, ఆవాలు, సాసు, త్రిఫలములు, అల్లము, పెద్ద ముస్తెపుపులగము, నాగముస్తెపుపులగము, చిట్టికూర, తెల్లగలిజేరు, పద్ది, చిత్రమూలము, నవాసారము అనువానిలో ప్రతిద్రవ్యమునుగాని, అందు దొరకినవానినిగాని రసమునకు పదియారవభాగము గ్రహించి ప్రత్యేకముగగాని, సముదాయముగగాని కలితో నూరి వస్త్రముపై అంగుళిప్రమాణము లేపనముచేసి దాని మధ్యమున పాదరసమును బోసి వస్త్రములో మూటగట్టి దానిని డోలాయంత్రమున నుడికించి కలితో నొకదినము వండుటయు స్వేదన మనంబడును.

## మర్దనవిధి

భిషగ్భిర్మర్దయేచ్చూర్ణై ర్మిళిత్వా షోడశాంశతః,
సూతస్య గాలితే వస్త్రే వక్ష్యమాణద్రవాదిభిః. 474
గృహధూమేష్టికాచూర్ణం తథా దధి గుడాన్వితం,
లవణాసురిసంయుక్తం క్షిప్త్వా సూతం విమర్దయేత్. 475
జీర్ణాభ్రకం తథాజీర్ణ బీజసూతం తథైవ చ,
గృహ్ణాతి నిర్మలో రోగాన్ గ్రాసేగ్రాసే విమర్దితః. 476

తా. కరుధూపము, ఇటికెరాయిపొడి, పెరుగు, బెల్లము, ఉప్పు, ఆవాలు, జీర్ణాభ్రకము - వీనిలో ప్రతిదానిచూర్ణమును రసమునకు పదియారవభాగముచేర్చి మర్దించి రసమును వస్త్రములోబోసి పిడిచిన నిర్మలమై శీఘ్రముగ రోగముల హరింపం జేయును.

## మూర్ఛనవిధి

సహా కన్యామలం హంతి త్రిఫలా వహ్నినాశినీ,
చిత్రమూలం విషం హంతి తస్మాత్తంచ ప్రయత్నతః. 477
మిశ్రితం మర్దయేత్సూతం సప్తవారేణ మూర్ఛయేత్,
ఇత్థం సంమూర్ఛిత స్సూతో దోషశూన్యః ప్రజాయతే 478

తా. కలుబంద పాదరసమునందలి మలదోషమును, త్రిఫలములు వహ్నిదోషమును, చిత్రమూలము విషదోషమును హరింపజేయును. కావున మిశ్రిత పాదరసమును కలుబంద, త్రిఫలములు, చిత్రమూలము అను నాసిరసములతో ప్రతిదానిచే ఏడేసిమార్లు మర్దించిన రసము మూర్ఛం జెందును. ఇటుల మూర్ఛంజెందినరసము దోషరహితంబు.

### ఉత్థాపనవిధి

జలై స్సోష్ణారనాళైర్వా క్షాళనా దుత్థితో భవేత్,
అథవా పాతనాయంత్రే పాతనా దుత్థితో భవేత్. 479
ఉత్థితః కాంజికక్వాథైః క్షాళనీయ మతఃపరం,

తా. పాదరసమును ఉష్ణోదకముతోగాని, ఉష్ణముగనుండు కలితోగాని, కడిగి దీసికొనిన ఉత్థితంబగును. లేక ఊర్ధ్వపాతనాయంత్రమునందును ఉత్థితంబగును. ఉత్థాపనానంతరము రసమును ఉష్ణముగ నుండుకలితో గడుగవలయును.

### ఊర్ధ్వపాతనవిధి

భాగా స్త్రయో రసస్యార్కచూర్ణ మంశాంశనింబుకమ్ 430
తతస్సంమర్దయే ద్యావ త్తావ దాయాతి పిండతాం,
తత్పిండం తలభాండస్థ మూర్ధ్వభాండే జలం క్షిపేత్. 481
కృత్వా లంబాలకే యంత్రే దత్వావార్ద్రిం హి మోదకం,
సంరోప్య చాగ్నిం మధ్యస్థం చతుర్యామంహి బోధయేత్. 432
యుక్త్యోర్ధ్వభాండసంలగ్నం గృహ్ణీయా త్పారదం తతః,
ఊర్ధ్వపాతన మిత్యుక్తం భిషగ్భి స్సూతశోధనే. 433
ససూతభాండవివర మన్యద్గలతి భాండకే,
తథా సంధిర్ధ్వయోః కార్యా పాతనాయంత్రయంత్రకే. 484
యంత్రప్రమాణం వదనా ద్గురోర్జ్ఞేయం విచక్షణః,

తా. పాదరసము మూడుభాగములు, జిల్లేడుపట్టమార్ణము ఒకభాగము - ఇటుల వీనిని గ్రహించి అందొకింత నిమ్మపండ్లరసము పోసి యుంటగ నగువఱకు మర్దించి దాని నధస్స్థితభాండమునం దునిచి పైభాండమునం దుదకముబోయుటచే డమరుకాయంత్రమన పరంగెడుదానిని పొయ్యిమీఁద నునిచి పైభాండమునందు శీతోదకముపోయుచు నాలుగుఝాములు మధ్యమాగ్నితో వండి పైకుండ నంటియుండురసమును యుక్తితో గ్రహింపవలయును. రసశోధనవిషయమున చేయంబడు నీక్రియనే ఊర్ధ్వపాతన మనియెదరు. ఊర్ధ్వపాతనాధస్స్థితభాండముఖములో పైభాండముయొక్క ముఖమును చేర్చి

బాగుగ సంధిలేపనము చేయవలయును. యంత్రప్రమాణమును గురుముఖమువలన దెలిసి కొనవలయును.

### అధఃపాతనవిధి

త్రిఫలా శిగ్రు శిఖిభి ర్లవణాసురిసంయుతైః. 485
నష్టపిష్టరసం కృత్వా లేపయే దూర్ధ్వభాండకే,
ఊర్ధ్వభాండోదరం లిప్త్వా చాధోభాండే జలం క్షిపేత్. 486
సంధిలేపం ద్వయోః కృత్వా తద్యంత్రం భువిపూరయేత్,
ఉపరిష్టాత్పుటే దత్తే జలే పతతి పారదః. 487
అధఃపాతన మిత్యుక్తం సిద్ధాద్యైః సూతకర్మణి,

తా. త్రిఫలములు, మునగ, చిత్రమూలము, ఉప్పు, ఆవాలు-వీనితోడ రసమును చేర్చి రసము గలియునటుల ఖల్వమున మర్దించి డమరుకయంత్రముయొక్క పైపాత్ర లోభాగమున దానినిబూసి క్రిందిపాత్రయందు ఉదకముపోసి ఆరెండుపాత్రలచేర్చి సంధులకు బాగుగ సీలమన్ను లేపనముచేసి గుంటడించి యాపాత్రను భూమిలోపూడ్చి దానిపై పుటంబిడవలయును. ఇటులచేసిన రసము జలముందు క్రిందిపాత్రయందు పడును. దీనిని సిద్ధాదులు రసకర్మయందు అధఃపాతనమని వచించెదరు.

### తిర్యక్పాతనము

ఘటేరసో వినిక్షిప్య సజలం ఘటమన్యకమ్. 488
తిర్యఙ్ముఖం ద్వయోఃకృత్వా సమ్ముఖం రోధయేత్సుధీః,
తథైవ చుల్యాం సంస్థాప్య యత్నత స్తంతతో భిషక్. 489
రసస్యోజ్వాలయేద్వహ్నిం యావత్సూతో జలం విశేత్,
తిర్యక్పాతనమిత్యుక్తం సిద్ధైశ్చైవార్జునాదిభిః. 490
మిశ్రితౌ నాగవంగౌ చ రసే విక్రయహేతుతః,
తాభ్యాం స్యాత్కృమిదోషస్తు తన్ముక్తిః పాతనత్రయాత్.
ఏవం సుసంస్కృతస్సూతః పాతనావిధియత్నతః,
సర్వదోషవినిర్ముక్తో జాయతే నాత్ర సంశయః. 492

తా. యంత్రమునకు తగినటుల ఒకింత నిడుపుగనుండు కుండల గ్రహించి అందొకదానిలో పాదరసమును, మఱియొకదానిలో నుదకమునుబోసి అడ్డముగ నునిచి వానిని చేర్చి సంధులకు సీలమన్ను లేపనముచేసి రసముపోసినకుండను పొయిమీద నడ్డముగ యుక్తితో నునిచి పాకముజేసిన రసమునీళ్ళలో బ్రవేశించును. దీనినే నాగార్జునుడు మొదలగుసిద్ధులు తిర్యక్పాతనమన్ని వచించెదరు. ఇటుల యుక్తిచే మూడుమార్లుతిర్యక్పా

తనము చేయుటవలన రసమునందలి నాగ, వంగ, క్రిమిదోషములు నివర్తించును. ఈతిర్యక్పాతనవిధివలన రసమునందలి సర్వదోషములు నిస్సంశయముగ హరించును.

## బోధనము

ఏవం కదర్థిత స్సూతః షండత్వ మధిగచ్ఛతి,
తన్ముక్తయేస్య క్రియతే బోధనం కథ్యతే హి తత్. 493

తా. పైప్రకారము శోధింపబడిన పాదరసమునందు షండత్వదోషం బుండును. అది నివర్తించుటకై బోధనక్రియను వచించెదను.

కదర్థ్యనేనైవ నపుంసకత్వ మేవంభవే దస్యరసస్యపశ్చాత్,
వీర్యప్రకర్షాయ చ భూర్జపత్రే స్వేద్యోజలే సైంధవచూర్ణగర్భే.

తా. రసమునకు పైఁజెప్పంబడిన సంస్కారమువలన షండత్వదోషము గలుగును. తన్నివారణార్థంబును, రససామర్థ్యము వృద్ధిఁజెందుటకును, రసమును భూర్జపత్రము, ఉదకము, సైంధవలవణము అనుపానితో పాకము జేయవలయును.

## నియమనము

సర్పాక్షీ చించకా వంధ్యా భృంగాబ్ద కనకాంబుభిః,
దినం సంస్వేదజ స్సూతో నియమాత్స్థిరతాం వ్రజేత్. 495

తా. పాదరసమును సర్పాక్షి, చింత, గొడ్డుకాకర, గుంటగలగర, తుంగముస్తెలు, ఉమ్మెత్త అనువానిరసముతోగాని, లేక కషాయములతోగాని, ఒకదినము వండిన నియమన మనంబడును.

## సందీపనము

కాసీసం పంచలవణం తదూర్ధ్వం నింబుకం రసం,
క్షిప్త్వా క్షిప్త్వాథ దాతవ్యం తాదృక్సైంధవఖేటకమ్. 496
గర్తే కృత్వా ధరాగర్భే దత్వా సైంధవసంయుతం,
ధూలి మష్టాంగుళిం దత్వా రాజికా మరిచాని చ. 497
ద్విశిగ్రుబీజ మేకత్ర టంకణేన సమన్వితం,
ఆలోడ్య కాంజికే డోలాయంత్రే పాచ్యం దినైస్త్రిభిః. 498
దీపనం జాయతే సమ్యక్సూతరాజస్య జారణే,

తా. అన్నభేది, పంచలవణము-వీనిని గ్రహించి దానిపై పలుమారు నిమ్మపండ్లరసమునుబోసి సైంధవలవణగడ్డను పగులఁగొట్టి అందు సైంధవలవణముతోడ పాదరసమును జేర్చి దానిపై పూర్వోక్త సైంధవలవణమును, నిమ్మపండ్లనంటించి దానిపై నెనిమిదంగుళముల ధూళినంటించి మునగవిత్తులు, చేదుమునగవిత్తులు, వెలిగారము అన

నీముాటిని నూరి కుండకు లేపనముచేసి అందు నిలినిబోసి దానిమధ్యమున డోలాయంత్రముతో మూడుదినములు వండిన రసము జారణసంస్కారణమునందు దీపనమగును.

(రసమున కష్టాదశసంస్కారములు చెప్పబడియుండినను "స్వేదో మర్దితమూర్ఛితా స్థితిరతః పాతో౽పి రోధాన్వితో, బోధ స్సంయమనం ప్రదీపనమితి స్పష్టాష్టధా సంస్కృతిః, అస్యాస్సర్వరసోపయోగికతయా త్వన్యాసవిన్యస్యతే, గ్రంథే౽స్మిక్ త్రకృతోపయోగనిరహః విస్తారభీత్యాన్వా." అను గ్రంథాంతరవచన ప్రకారము స్వేదన, మర్దన, మూర్ఛన, ఉత్థాపన, పాతన, బోధన, సంయమన, ప్రదీపనములు ననిమిది సంస్కారములు సర్వోపయోగంబులగుటచే చెప్పంబడియెను. తక్కినపదిసంస్కారములు ఔషధోపయోగంబులు గాకుండుటం జేసియు, గ్రంథవిస్తరభీతిం జేసియు చెప్పంబడవయ్యెను.)

## రసభస్మము

దత్వా వింశతిభాగకే జలధిజే సూతస్య భాగం దృఢం
ఖల్వే మర్ద్య చ కాంజికేన సతతం యద్వా తత శ్చాంబునా,
ఉద్ధృత్యాపి చ నిక్షిపేచ్చ పుటయే దేవం యథేష్టోరస
స్సాముద్రైశ్చ సుమార్యతే చ లవణై రేవం ప్రకారేణ చ. 499

తా. ఒకపలము శుద్ధిచేసిన రసములో ఒకపలము సముద్రలవణమును గలిపి, యవి యిగురువఱకు మర్దింపవలయును. ఇట్లిరువది పలములసముద్రలవణ మిగురువఱకు పాదరసమును కలితో మర్దించి హాండికాయంత్రమునందునిచి పాకముజేసినరసము భస్మంబగును. ఆరసభస్మమును గొనికొని భస్మముగాకుండురసమును మరల లవణము, కలి అనువానితో మర్దించి హాండికాయంత్రమునందునిచి పాకముజేసిన యారసము భస్మంబగును. రసము భస్మంబగువఱకు పైప్రకారమే మర్దనపాకముల జేయవలయును. (భస్మమైనరసమును గ్రహించుతెఱం గెట్లనిన—రసభస్మమును, తీయనినీళ్ళను ఖల్వములో బోసి మర్దించి యొకకుండలోబోసి దానినిండా యుదకముపోసి ౮ ఝాములు పేరనిచ్చి యందలియుదకమును వడిపిన క్రింద తెల్లగ రసభస్మము నిలిచియుండును. అందు మరల నుదకముపోసి బాగుగగలిపి నీళ్ళు తీయగనగువఱకు వడిపి క్రిందనుండు రసభస్మమును దీసికొనిఖల్వమున నెండించి దంతపుకరాటములో నునిచికొనవలయును. అట్టి రసభస్మమును ౪ తులము, జాజికాయ ౧ తులము, జాపత్రి ౧ తులము, లవంగములు ౧ తులము, పిప్పలి ౧ తులము, వాయువిడంగములు ౧ తులము, ఓమము ౧ తులము, బెల్లము ౮ తులములు-ఇటుల వీనినెల్ల నేకముజేసి మర్దించి మాత్రలుచేసి యందొక్కదానిని సాయంప్రాతఃకాలములయం దావునేతిలో సేవించి చప్పిడిపథ్యము నాచరింపుచు నావుచల్లనుద్రాగుచు నుండవలయును. దానివలన సర్వరోగములు హరించును.)

శుద్ధసూత స్తదర్ధంతు శుద్ధగంధకమేవచ,
తయోః కజ్జలికాం కుర్యా ద్దినమేకం విమర్దయేత్, 500
మృత్కర్పటవిలిప్తాయాం కుప్యాం కజ్జలికాం క్షిపేత్,
వాలుకాయంత్రకే పాచ్యా యావద్దినచతుష్టయమ్.
గృహ్ణీయా దూర్ధ్వసంలగ్నం సిందూరం రససన్నిభం,

తా. శుద్ధిచేసినరసము ఒకభాగము, శుద్ధిచేసినగంధకము అరభాగము - ఇటుల వీనినేకముజేసి కజ్జలిగ నొకదినము మర్దించి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనము జేసి యెండించి వాలుకాయంత్రమునందిడి, నాలుగుదినములు పాకముచేసి సాంగశీతల మునదీసి గాజుకుప్పెగొంతు నంటియుండు రససిందూరమును గ్రహింపవలయును.

ధూమసారం రసం తోరీ గంధకం నవసాగరమ్. 502
యామైకం మర్దయే దమ్లై ర్భాగం కృత్వా సమంసమం,
కాచకుప్యాం వినిక్షిప్య తాంచ మృద్వస్త్రముద్రయా. 503
విలిప్య పరితో వస్త్రే ముద్రాం దత్వాచ శోషయేత్,
అథ స్వచ్ఛిద్రపిఠరీ మధ్యే కుప్యాం నివేశయేత్. 504
పిఠరీం వాలుకాపూరై ర్భృత్వా చాకూపికాగళం,
నివేశ్య చుల్ల్యాంతదధః కుర్యా ద్వహ్నిం శనై శ్శనైః. 505
తస్మా దప్యధికం కించిత్పావకం జ్వాలయే త్క్రమాత్,
ఏవం ద్వాదశభిర్యామై ర్ర్మియతే సూతకోత్తమః. 506
స్ఫోటయే త్స్వాంగశీతం చాపూర్ధ్వగం గంధకం జయేత్,
అధస్థం మృతసూతంచ సర్వకర్మసు యోజయేత్. 507

తా. కరుధూపము, శుద్ధిచేసినరసము, పటికారము, శుద్ధిజేసినగంధకము, నవాసాగరము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో నొకఝాము మర్దించి గాజుకుప్పెలో నునిచి దానినోటికి బిరడవేసి చీలమన్ను లేపనముచేసి యెండించి చట్టికి క్రిందిభాగమున దబ్బనముతో రంధ్రముచేసి యాచట్టిమధ్యమున గాజుకుప్పె నునిచి కుప్పెగొంతువఱకు నిసుకబోసి యాచట్టిని పొయిమీఁదనునిచి లఘ్వగ్నితో పాకముచేయుటయేగాక క్రమముగ నగ్నిని హెచ్చించుచుండవలయును. ఇట్లుగాగున పన్నెండుఝాములు పాకముచేసి సాంగశీతలమున కుప్పెనుదీసికొని యుక్తితో పగుల గొట్టి దానినోటియందంటియుండు గంధకమును పరిగ్రహించి క్రిందయుండురసభస్మమును దీసికొని సర్వకార్యములయందు నుపయోగించుకొనవలయును.

కాకోదుంబరికాదుగ్ధే రసం కించి ద్విమర్దయేత్,
తద్దుగ్ధఘృష్టహింగోశ్చ మూషాయుగ్మం ప్రకల్పయేత్. 508
క్షిప్త్వా తత్సంపుటే సూతం తత్ర ముద్రాం ప్రదాపయేత్,
ధృత్వా తం గోళకం ప్రాజ్ఞో మృన్మూషా సంపుటేభికే. 509
పచేన్మృదుపుటేనైవ సూతకో యాతి భస్మతాం, (మతాంతరే)

తా. శుద్ధిచేసిన రసమును ఖల్వములో బోసి బ్రహ్మమేడిపాలతో యొకింత మర్దించి పిదప ఇంగువను బ్రహ్మమేడిపాలతో నూరి రెండుమూసలుజేసి యందొకదానిలో నొకింత మర్దించిన పైపాదరసమునునిచి దానిపై రెండవమూసను మూసి బాగుగచేర్చి యుంటజేసి మూసపుటలో నునిచి చీలమన్ను లేపనముజేసి పిడకలతో లఘుపుటం బిడిన రసము భస్మంబగును.

అపామార్గస్య బీజానాం మూషాయుగ్మం ప్రకల్పయేత్. 510
తత్సంపుటే న్యసేత్ సూతం మర్కదుగ్ధవిమిశ్రితం,
ద్రోణపుష్పీ ప్రసూనాని విడంగ మరిమేదకమ్. 511
ఏతచ్చూర్ణ మధశ్చోర్ధ్వం దత్వా ముద్రాం ప్రదాపయేత్,
తంగోళం ముద్రయేత్సమ్యఙ్మృన్మూషా సంపుటే సుధీః. 512
ముద్రాం దత్వా శోషయిత్వా తతో గజపుటే పచేత్,
ఏవ మేకపుటేనైవ జాయతే సూతభస్మకమ్. 513

తా. ఉత్తరేణివిత్తులనూరి రెండుమూసలుచేసి అందొకదానిలో తుమ్మిపూలు, వాయువిడంగములు, నల్లతుమ్మపట్ట అనువాని చూర్ణమునువైచి శుద్ధిచేసినరసమును జిల్లేడుపాలతో మర్దించి యాచూర్ణముపై బోసి దానిపై తుమ్మిపూలు మొదలగువాని చూర్ణమును వైచి మఱియొకమూతను మూసి సందులకు చీలమన్ను లేపనముజేసి మంటి మూసలోనునిచి దానిపై మఱియొక మంటిమూతనుమూసి సందులకు చీలమన్ను లేపనము జేసి యెండించి గజపుటంబిడిన రసము భస్మంబగును.

## రససిందూరము

పలద్వయం శుద్ధరసం పలార్ధం శుద్ధగంధకం,
కర్షార్ధం నవసారంచ జంబీరేణ విమర్దయేత్. 514
కాచకుప్యాం క్షిపేచ్చైవ మృత్కర్పట్యాచ సప్తధా,
విలిప్య కాచకుప్పీంతా మాతపే శోషయే ద్దృఢమ్.
ఛిద్రభాండే తతో కుప్పీం న్యసేత్ సికతయంత్రకే,

కుప్పికాకంఠ మానేన పూజయే ద్దిష్టదేవతాః. 516
పంచభోజ్యా కుమార్యశ్చ శశ్చుల్యాం వినిక్షిపేత్,
పచే ద్యామాష్టకంచైవ కుప్పికాంచ క్షణేక్షణే. 517
సంశోధ్య పాచయేద్యంతే స్వాంగశీతం సముద్ధరేత్,
గ్రాహ్యంచ దరదాకారం దేవదానవదుర్లభమ్. 518
సేవయే ద్రోగనాశాయ తతో రోగానుపానతః,
వల్లంవా వల్లయుగ్మంవా మధునా కణయాసహ. 519
సేవితం కామినీకామం దర్పయే ద్రతికౌతుకే,
వీర్యబంధకరం శీఘ్రం యోషామదవినాశనమ్. 520
సిందూరం హరవీర్యసంభవమిదం రూక్షాగ్నిమాంద్యాపహం
యక్ష్మాది క్షయ పాండు శోఫ ముదరం గుల్మ ప్రమేహాపహం,
శూల ప్లీహ వినాశనం జ్వరహరం దుష్టవ్రణా న్నాశయే
దర్శాంసి గ్రహణీభగందరగ్రహం ఛర్ది త్రిదోషాపహమ్.

తా. శుద్ధిచేసినరసము రెండుపలములు, శుద్ధిజేసినగంధకము అరపలము, నవాసాగరము అరకర్షము-ఇటుల వీనినేకముచేసి కజ్జలిగ మర్దించి ఎమ్మపండ్లరసముతో నూరి గాజుకుప్పెలో నునిచి దానిపై నేడుమార్లు చీలమన్ను లేపనముచేసి బాగుగ నెండనెండించి ఛిద్రముగల వాలుకాయంత్రమునం దునిచి యాగాజుకుప్పెకంఠమువఱకు నిసుకపోసి ఇష్టదేవతాపూజచేసి ఐదుకుమారికల కన్నంబిడి పొయిమీద నునిచి పలుమారు కుప్పెను బరీక్షింపుచు నెనిమిదిఝాములు పాకముచేసి స్వాంగశీతలమున దేవదైత్యులకు దుర్లభంబై ఇంగిలీకమువలె నెఱ్ఱగనుండు రససిందూరమును గ్రహింపవలయును. ఇట్టి రససిందూరములో ఒకటి, లేక రెండువల్లముల ప్రమాణము నాయారోగోక్తానుపానముతోడనేని, తేనె, పిప్పలి అనువానితోడనేని సేవించిన సర్వరోగముల హరింపంజేయుటయేగాక స్త్రీలకు శీఘ్రముగ సంతోషమును జూపించునట్టి వీర్యబంధనకారిగ, స్త్రీ మదమును హరింపంజేయునదిగ నుండును. మఱియు పాదరసమువలన జనించిన యీసిందూరము రూక్ష, అగ్నిమాంద్యము, రాజయక్ష్మ, క్షయము, పాండువు, శోఫ, ఉదరము, గుల్మము, ప్రమేహము, శూల, ప్లీహము, జ్వరము, దుష్టవ్రణము, అర్శస్సు, గ్రహణి, భగందరము, గ్రహదోషము, వాంతి, త్రిదోషము అనువానిని హరింపంజేయును.

పలమాత్రం రసంశుద్ధం తావన్మాత్రంతు గంధకం,
విధివ త్కజ్జలీం కృత్వా న్యగ్రోధాంకురవారిణా. 522
భావనా త్రితయం దత్వా స్థాలీమధ్యే నిధాపయేత్,
విధాయ కచ్ఛపీయంత్రే వాలుకాభిః ప్రపూరయేత్. 523

దద్యాత్తదను మందాగ్నిం భిషగ్యామచతుష్టయం,
జాయతే రససిందూరం తరుణార్కసన్నిభమ్. 524
అనుపానవిశేషేణ కరోతి వివిధాన్గుణాన్,
క్షయ కుష్ఠ మరుత్పిత్త మేహఘ్నం పాండు నాశనమ్. 525

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము - ఈ రెంటిని సమముగ చేర్చి కజ్జలిగ మర్దించి సుల్లిపాయరసముతో మూడుభావనలు చేసి పాత్రలో నునిచి కచ్ఛప యంత్రమునందిడి దానిలో నిండారపోసి మందాగ్నితో నాలుగుయామములు మందాగ్నితో పాకముచేసిన బాలార్కునివంటి కాంతిగల రససిందూరము జనించును. దాని ననుపానవిశేషములతో సేవించిన పలువిధములైన గుణములు గలుగంజేయుటయేగాక క్షయము, కుష్ఠువు, వాత పిత్తమేహములు, పాండువు - వీనిని నిసగా హరింపంజేయును.

రసకర్పూరోత్పత్తి

రసభస్మచ యన్మూర్ఛ ఊర్ధ్వపాతంచ జాయతే,
సర్వౌషధానాం సమ్మిశ్రం సర్వరోగహరంపరమ్. 526
గుంజాప్రమాణం సేవేత వలీపలితనాశనం,
తద్భస్మ రసభేదైశ్చ రసకర్పూరసంజ్ఞకః. 527

తా. మూర్ఛ చెంది యూర్ధ్వపాతమువలన జనించు రసభస్మమే రసకర్పూర మనంబడును. దీనిని సర్వౌషధములయందుచేర్చి సేవించిన సర్వరోగముల హరింపంజేయును. మఱియు గుంజాప్రమాణమును సేవించిన ముదిమిని హరింపంజేయును. ఈభస్మము రసభేదంబగుటచే రసకర్పూర మనంబడును.

రసకర్పూరసేవనచే హరించురోగములు

రసకర్పూర మమృతం వాతాశీతి వినాశనం,
కుష్ఠాష్టాదశ భేదంచ మేహవింశతి నాశనమ్. 528
వ్రణాదిదుష్టరక్తాని భగంధర మహోదరం,
గ్రహణీం గుల్మ మానాహ క్షయం హిధ్మాంచ నాశయేత్. 529
శ్లేష్మారి పీనసాజీర్ణ రక్తపిత్తంచ నాశయేత్,
అర్శాంసి విషజాలంచ మహాకర్పూరసేవయా. 530

తా. రసకర్పూరము అమృతతుల్యంబగుటచే అశీతివాత, అష్టాదశకుష్ఠ, వింశతిమేహ, దుష్టవ్రణాది, దుష్టరక్త, భగందర, మహోదర, గ్రహణి, గుల్మ, ఆనాహ, క్షయ, హిధ్మ, శ్లేష్మాది, పీనసాజీర్ణ, రక్తపిత్తార్శ, విషసమూహముల హరింపంజేయును. కావున మహాకర్పూరమునే సేవింపవలయును.

## నవరత్న నామంబులు

కుర్వింద మౌక్తికం వజ్రం వైడూర్య శక్రనీలకం,
పుష్పరాగం మరకతం గోమేధిక ప్రవాళకమ్. 531
నవరత్నం క్రమాచ్ఛోధ్యం మారయే ద్వినియోజయేత్,

తా. కురువిందము, మౌక్తికము, వజ్రము, వైడూర్యము, శక్రనీలకము, పుష్పరాగము, మరకతము, గోమేధికము, ప్రవాళము అనునవి నవరత్న నామంబులు. వానిని క్రమముగ శుద్ధి, భస్మము జేసి యౌషధములయం దుపయోగింపందగును.

## అశుద్ధరత్న గుణము

అశుద్ధరత్నం విస్ఫోట తాప భ్రమ రుజాకరమ్. 532
బలహానిం వీర్యనాశం తస్మాద్రత్నాని శోధయేత్,

తా. అశుద్ధమైనరత్నములు విస్ఫోటకము, తాపము, భ్రమ, పీడ, దౌర్బల్యము, వీర్యనాశనము అనువానిని గలుగంజేయును. అట్లగుటచే వానిని శుద్ధిజేయవలయును.

## మాణిక్యశుద్ధి

అశ్వమూత్రాంతరే భావ్యం త్రిదినంచ బలాతపే.
తథోష్ణవారిణా క్షాళ్యం రత్నశుద్ధి ర్భవిష్యతి,

తా. కెంపులను గుఱ్ఱపుమూత్రములో వేసి మూడుదినములు మంచి యెండయం దునిచి భావనజేసి యుష్ణోదకములో గడిగిన శుద్ధియగును.

## * మాణిక్యభస్మము

తన్మాణిక్యం రవిక్షీరే దివసత్రయ భావితమ్. 534
శరావే త్రిపుటం పాచ్యం భస్మీ భవతి తత్క్షణాత్,

తా. శుద్ధిజేసిన కెంపులను జిల్లేడుపాలతో మూడుదినములు భావనజేసి మూకుళ్ళలో నునిచి చీలమన్ను లేపనముజేసి పిడకలతో మూడుపుటంబు లిడిన మాణిక్యము భస్మంబగును.

## మాణిక్యగుణము

మాణిక్యం శిశిరం స్నిగ్ధంమధు కాంతికరం లఘు. 535
దీపనం వృష మాయుష్యం మనోజ్ఞం గ్రహదోషనుత్,

తా. కెంపుశీతలముగ, స్నిగ్ధముగ, మధురముగ, కాంతికరముగ, లఘువుగ, అగ్నిదీపనకారిగ, వీర్యవృద్ధికారిగ, ఆయుర్వృద్ధికారిగ, మనోజ్ఞముగ, గ్రహదోషములబోకడచునదిగ నుండును.

---

*మాణిక్య మన కెంపులు.

మౌక్తికనామములు

ముక్తాఫలం మౌక్తికం శుక్తిజంస్యా త్తారాకారా తౌతిలాముక్తికాచ,
అంభస్సారం శీతలం నీరజంచ నక్షత్రం స్యాద్బిందురత్నంచ రత్నమ్.

(నిఘంటౌ)

తా. ముక్తాఫలము, మౌక్తికము, శుక్తిజము, తారాకారము, తౌతిలము, ముక్తికము, అంభస్సారము, శీతలము, నీరజము, నక్షత్రము, బిందురత్నము, రత్నము అనునవి ముత్తియముల పేర్లు.

మౌక్తికశుద్ధి

కుండలీఫలజద్రావై ర్భావితం దినసత్రయం,
అథవా తింత్రిణీద్రావై శుద్ధిర్భవతి మౌక్తికమ్. 537

తా. ముత్తియములు తెల్లగుమ్మడిపండ్లరసముతోగాని, చింతపండుపులుసుతోగాని (కుంకుడుపండ్లరసముతోగాని) మూడుభావనలు చేసిన శుద్ధియగును.

మౌక్తికభస్మము

శుద్ధముక్తా ఫలశ్వేతబృహతీఫలజద్రవైః,
భావితం భూపుటే పాచ్యం భస్మశుద్ధం భవిష్యతి. 538

తా. శుద్ధిచేసినముత్తియముల తెల్లములకపండ్లరసముతో భావనచేసి మూకుళ్ళలోనునిచి చీలమన్ను లిచ్చి భూపుటంబిడిన శుద్ధభస్మంబగును.

మౌక్తికగుణము

ముక్తాఫలం హిమం స్వర్యం తీక్ష్ణం చోష్ణం గదాపహం,
దీపనం వస్తిశూలఘ్నం మనోజ్ఞం గ్రహదోషనుత్. 539

తా. ముత్తియములు శీతలముగ, స్వరభంగమును బోకడచునదిగ, తీక్ష్ణముగ, ఉష్ణరోగములం బోకడచునదిగ, అగ్నిదీపనకారిగ, వస్తిశూలను బోకడచునదిగ, మనోజ్ఞముగ, గ్రహదోషమును బోకడచునదిగ నుండును.

అశుద్ధవజ్రగుణము

హృత్పార్శ్వపీడా శ్వయథు కుష్ఠ గుల్మ రుజాకరం
పాండుతాప గురుత్వంచ తస్మా చ్ఛుద్ధంచ మారయేత్. 540

తా. అశుద్ధవజ్రగుణములు హృత్పార్శ్వములయందు నొప్పి, వాపు, కుష్ఠువు, గుల్మము, పాండువు, తాపము, జడత్వము అనువానిని గలుగంజేయును. కావున శుద్ధిచేయఁబడిన వజ్రములనే భస్మము చేయవలయును.

వజ్రభేదములు

శ్వేత రక్తం పీత కృష్ణం ద్విజాద్యా వజ్రజాతయః. 541

తా. తెల్లనివర్ణముగల వజ్రము బ్రాహ్మణజాతియనియు, ఎఱ్ఱనివర్ణముగలవజ్రము క్షత్రియజాతియనియు, పీతవర్ణముగలవజ్రము వైశ్యజాతియనియు, కృష్ణవర్ణముగల వజ్రము శూద్రజాతియనియు జెప్పంబడును.

వజ్రగుణము

రసాయనం భవే ద్విప్ర శ్శుభ్రం సిద్ధ్యష్టదాయకం,
క్షత్రియో మృత్యుజి ద్రక్తం వలీపలితరోగహః, 542
ద్రవ్యకారీ భవే ద్వైశ్యః పీతం దేహస్య జాడ్యకృత్,
కృష్ణ శ్శూద్రో రుజాం హంతి వయ స్తంభం కరోతిచ. 543

తా. తెల్లనివర్ణముచే బ్రాహ్మణజాతియని పరంగెడువజ్రము రసాయనములయం దుపయోగించిన అష్టసిద్ధులు గలుగును. రక్తవర్ణముచే క్షత్రియజాతియని పరంగెడు వజ్రము మృత్యువును ముదిమిని, రోగములను హరింపజేయును. పచ్చనివర్ణముచే వైశ్య జాతియని పరంగెడువజ్రము ద్రవ్యకారిగ నుండుటయేగాక శరీరజాడ్యమును గలుగం జేయును. నల్లనివర్ణముచే శూద్రజాతియని పరంగెడువజ్రము రోగముల బోకడచి వయ స్స్తంభనమును గలుగంజేయును.

వజ్రజాతినిర్ణయము

పుం స్త్రీ నపుంసకంచేతి లక్షణేనతు లక్షయేత్. 544

తా. వజ్రములయొక్క పురుష, స్త్రీ, నపుంసకభేదముల వానిలక్షణములవలన తెలియవలయును.

వజ్రలక్షణ, తద్గుణముచు

సువృత్తాః ఫలసంపూర్ణా స్తేజోయుక్తా బృహ త్తరాః,
పురుషాస్తేరకా స్తేచ రేఖాబిందువివర్జితాః 545
రేఖాబిందుసమాయుక్తా షడస్రా స్తే స్త్రియస్స్మృతా,
త్రికోణాశ్చ సుదీర్ఘాశ్చ విజ్ఞేయా స్తే నపుంసకాః. 546
*పూర్వపూర్వమిమే శ్రేష్ఠాః పురుషాః రసబంధకాః,
శరీరకాంతిజనకాః భోగదా వజ్రయోషితః. 547
నపుంసకా హ్యల్పవీర్యాః కాముకా స్సత్వవర్జితాః,

తా. గుండ్రముగ, సంపూర్ణమైన పలకలుగలదిగ, తేజోవంతముగ, పెద్దదిగ, రేఖలు, బిందువులులేనిదిగ నుండువజ్రము పురుషజాతియనియు, రేఖలు బిందువులు వీనితోగూడి ఆరుకోణములుగలదై యుండువజ్రము స్త్రీజాతీయనియు, మూడుకోణ

* సర్వేషు పురుషాశ్శ్రేష్ఠా వేధకా రసబంధకాః.

మూలుగలదై నిడుపుగనుండువజ్రము నపుంసకజాతియనియు తెలియవలయును. వానిలో ముందుముంచుదిశ్రేష్ఠంబు. అందు పురుషవజ్రము రసబంధనకారిగ నుండును. స్త్రీవజ్రము శరీరకాంతికారిగ, భోగకారిగ నుండును. నపుంసకవజ్రము అల్పవీర్యముగలదిగ, కాముకులకు సత్త్వమును బోకొడచునదిగ నుండును.

### స్త్రీత్వాదిజాతి భేదములవలన వజ్రోపయోగము

స్త్రీతు స్త్రీణాం ప్రదాతవ్యం క్లీబే క్లీబం తథైవచ. 548
సర్వేషాం సర్వదా యోజ్యః పురుషో బలవత్తరః.

తా. స్త్రీలకు స్త్రీవజ్రమును, నపుంసకులకు నపుంసకవజ్రమును, సమస్తమైన వారికి పురుషవజ్రమును ప్రయోగించిన బలవత్తరంబుగ నుండును.

### వజ్రశుద్ధి

గృహీత్వాహ్ని శుభే వజ్రం వ్యాఘ్రీకందే వినిక్షిపేత్. 549
మహిషీవిష్ఠయా లిప్త్వా కరీషాగ్నౌ విపాచయేత్,
నిశాయాంతు చతుర్యామం *నిశాంతే చాశ్వమూత్రకైః. 550
సేచయేత్త్వాచ మేవం సప్తరాత్రేణ శుధ్యతి,

తా. వజ్రములను శుభకరమైనదినమున గ్రహించి నేలములకపేరులో నునిచి బఱ్ఱె పేడలో పొదిగి ప్రాతఃయెరువు, ఱాముక అనువానితో రాత్రికాలంబున నాలుగుఝాములు పుటంబిడి ప్రాతఃకాలమున గుఱ్ఱపుమూత్రములో వేసి వానిం దీసికొని మునుపటి వలెనే నేలములకపేరులో నునిచి నాలుగుఝాములు రాత్రియందు పుటంబిడి వానిం దీసి గుఱ్ఱపుమూత్రములో వేయవలయును. ఇటుల నేడుదినములు జేసిన వజ్రములు శుద్ధియగును.

కుళుత్థకోద్రవక్వాథే డోలాయంత్రే విపాచయేత్. 551
వ్యాఘ్రీకందగతం వజ్రం సప్తాహాద్విమలం భవేత్,

తా. వజ్రముల నేలములకపేరులోనునిచి ఉలవలు, అళ్లి అనువానికషాయములతో డోలాయంత్రమున నేడుదినములువండిన వజ్రములు శుద్ధియగును.

మేఘనాద శమీ శ్యామా శృంగీ మదనకోద్రవమ్. 552
కుళుత్థ వేతసం చాఖుకర్ణీవై సిందువారకం,
ఏతేషాంచ జలక్వాథై ర్వజ్రం జంబీరమధ్యగమ్. 553
డోలాయంత్రే త్ర్యహం పాచ్య మేవం వజ్రం విశుధ్యతి,

తా. వజ్రముల నిమ్మపండులో నునిచి చిఱ్ఱి, జమ్మి, తెగడ, కర్కాటకశృంగి,

* మూమిన్యంతే.

మ్రుంగ, ఆక్లు, ఉలవలు, ప్రబ్బలి, ఎలుకచెవియాకు (అవిసె), వావిలి (ఈశ్వరివేరు) అనువానికషాయములతో డోలాయంత్రమున మూడుదినములు వండిన వజ్రములు శుద్ధియగును.

## వజ్రభస్మము

త్రివర్గనాగవల్ల్యస్తు కార్పాసారూఢమూలికాః. 554
పిష్ట్వా తన్మధ్యగం వజ్రం కృత్వా మూషాం నిరోధయేత్,
పచేద్గజపుటే తచ్చమ్రియతే సప్తధాపుటైః. 555

తా. మూడేండ్లతమలపాకులు, ప్రత్తివేళ్ళు-వీనిని నూరి ముద్దచేసి దానిలో శుద్ధిచేసిన వజ్రముల నునిచి యాముద్దను *అంధమూషలో బెట్టి ఏడుగజపుటంబు లిడిన వజ్రములు భస్మంబగును.

వజ్రం మత్కుణరక్తేన సప్తధా పరిభావితం,
వేష్టయే ద్బదరీపత్త్రై రుధ్వా గజపుటే పచేత్. 556
పునర్లేప్యం పునస్తాప్యం సప్తధా మ్రియతేచ తత్,

తా. వజ్రముల నల్లినెత్తురుతో నేడుమార్లు భావనజేసి రేగాకులతో పొదిగి పైన చీలమన్ను లేపనముచేసి మూసలో నునిచి ధానిపై చీలమన్నుపూసి ఏడుగజపుటంబు లిడిన వజ్రములు భస్మంబగును.

శుద్ధవజ్రం వజ్రవల్లీరసేన పరిభావితమ్. 557
వజ్రమూషాంతరే క్షిప్త్వా భస్మీభవతి తత్క్షణాత్,

తా. శుద్ధిచేసినవజ్రముల నల్లేరురసములో నొకదినము నానబెట్టి వజ్రమూషలో నునిచి చీలమన్ను లేపనముచేసి ఏరుపిడకలతో గజపుటం బిడిన వజ్రములు భస్మంబగును.

## వజ్రభస్మగుణము

వజ్ర మాయు ర్బలం రూపం దేహసౌఖ్యం కరోతిచ. 558
సేవితం హంతి రోగాంశ్చ మృతవజ్రం న సంశయః,

తా. వజ్రభస్మము ఆయువు, బలము, రూపము, శరీరసౌఖ్యము-వీనిని గలుగంజేయుటయేగాక దాని సేవనవలన సర్వరోగములను నిస్సంశయముగ హరింపంజేయును.

---

* అంధమూషాతుకర్తవ్యా గోస్తనాకారసన్నిభా, సైవఛిద్రాన్వితా మధ్యే గంభీరాసారణోచితా.

## వైక్రాంతోత్పత్తి

దేవ్యాహతే మహాదైత్యే మహిషాసురసంజ్ఞకే. 559
అస్యరక్తంతు పతితం యత్రయత్ర స్థితం భువి,
తత్రతత్ర తు వైక్రాంతం వజ్రాకారం మహారసః. 560
వింధ్యస్య దక్షిణావాసే ఉత్తరే వాస్తి పర్వతః,
నికృంతయతి లోహాని తేన వైక్రాంత మిష్యతే. (సిద్ధవిద్యాభూః)

తా. మహిషాసురుఁడను నామముగల మహాదైత్యుని దేవి సంహరించినపుడు వాని రక్తముపడిన స్థలమునందంతట వజ్రాకారమైన వైక్రాంతము జనించెను. ఆవైక్రాంతపర్వతములు వింధ్యపర్వతమునకు దక్షిణభాగమునందు ఉత్తరభాగమునందు నున్నయవి. ఇది లోహముల భేదించునట్టి శక్తిగలవి యగుటచేసి వైక్రాంత మనంబడును.

## వైక్రాంతలక్షణము

అష్టకం చాష్టఫలకః షట్కోణ మసృతో గురుః,
శుద్ధ మిశ్రితవర్ణశ్చ యుక్తో వైక్రాంత ఉచ్యతే. 562

తా. ఎనిమిదిభేదములు, ఎనిమిదిపలకలు, ఆరుకోణములు, అమృతగుణము, శుద్ధవర్ణము, బరువు, మిశ్రితవర్ణముగలది వైక్రాంత మనంబడును.

## వైక్రాంతభేదములు

శ్వేతో రక్తశ్చ పీతశ్చ నీలః పారావతప్రభః,
శ్యామలః కృష్ణవర్ణశ్చ కర్బూరశ్చాష్టమో మతః. 563

తా. వైక్రాంతము తెలుపు, ఎఱుపు, పసపు, నీలము, పావురపిట్టవర్ణము, శ్యామలవర్ణము, కృష్ణవర్ణము, కర్బూరవర్ణము అనువర్ణభేదములచే ఎనిమిదివిధంబులు.

## వైక్రాంతశుద్ధి

త్రిక్షారైః పంచలవణై ర్వసామూత్రామ్లకద్రవైః,
మత్స్యతైలే ఘృతే తైలే స్యేరండే కాంజికాన్వితే. 564
సప్తాహం డోలికాయంత్రే వ్యాఘ్రీకందగతం పచేత్,
సర్వవర్ణంతు వైక్రాంతం శుద్ధి మాయాతి నిశ్చయమ్. 565

తా. త్రిక్షారములు, పంచలవణములు, వస, సప్తవిధమూత్రములు, ఆమ్లపంచకము, మత్స్యతైలము, నెయ్యి, నూనె, ఆముదము, కలి-పీనిని డోలాయంత్రమున

చేర్చి నేలములక వేరు తొలచి యందు వైక్రాంతముల నునిచి వండిన సర్వవర్ణములుంగల వైక్రాంతములు శుద్ధియగును.

### వైక్రాంతశుద్ధి, తద్భస్మవిధి

వైక్రాంతం వజ్రవ చ్ఛోధ్యం నీలం శ్వేతంచ లోహితం,
హయమూత్రేణ తత్సించే త్తప్తం తప్తం త్రిసప్తథా. 566
తత శ్చోత్తరవారుణ్యాః పంచాంగే గోళకే క్షిపేత్,
రుధ్వా మూషాం పుటే పాచ్య ముద్ధృత్య గోళకే పునః. 567
క్షిప్త్వా రుధ్వా పుటే దేవం సప్తథా భస్మతాం వ్రజేత్,

తా. నల్లగగాని, తెల్లగగాని, ఎఱ్ఱగగాని నుండు వైక్రాంతముల వజ్రములవలెనే శుద్ధిజేయవలయును. మఱియు వైక్రాంతము నెఱ్ఱగ నిరువదియొకమారు కాచి గుఱ్ఱపు మూత్రములో అంమారువేసి చల్లార్చిన శుద్ధియగును. పిదప దుష్టపుసమూలమును ముద్ద నూరి దానిలో శుద్ధిచేసిన వైక్రాంతముల నునిచి యాముద్దను మూషలో నునిచి దానిపై మఱియొకమూసను మూసి చీలమన్ను లేపనముచేసి గజపుటంబిడి సాంగశీతలమునదీసి మరల వైక్రాంతముల పైప్రకారమే దుష్టపుముద్దలోనునిచి యాముద్దను మూసలోబెట్టి దానిపై మఱియొకమూసను మూసి చీలమన్ను లేపనముచేసి ఏడుగజపుటంబు లిడిన వైక్రాంతము భస్మంబగును.

### వైక్రాంతభస్మము

వైక్రాంతం వజ్రవచ్ఛోధ్యం ధ్మాతం సిక్తంచ మూత్రకే. 568
వజ్రవ న్మృతి మాయాతి వజ్రస్థానే నియోజయేత్,

(సిద్ధవిద్యాభూః)

తా. వైక్రాంతమును వజ్రమువలెనే కొలిమిలో నూది గుఱ్ఱపుమూత్రములో నద్దుటచే శుద్ధిచేసి వజ్రమువలెనే భస్మముచేసి వజ్రస్థానమున నుపయోగింపందగును.

### వైక్రాంతద్రుతి

కేతకీస్వరసం గ్రాహ్యం సైంధవం స్వర్ణపుష్పికా. 569
ఇంద్రగోపకసంయుక్తం స్వర్ణభాండే వినిక్షిపేత్,
సప్తాహం స్వేదయే త్తస్మిన్ వైక్రాంతం ద్రవతాం వ్రజేత్. 570

తా. మొగలిచన్నులరసము, సైంధవలవణము, రేలపువ్వు, * ఇంద్రగోపపురుగులు - వీనితోడ వైక్రాంతమును చేర్చి బంగారుపాత్రయందు నునిచి ఏడుదినములు పాకము చేసిన వైక్రాంతము ద్రవించి ద్రుతివలె నగును.

## వైక్రాంతసత్వము

వైక్రాంతం వజ్రకందంచ స్నుహ్యాక్షీరం పయసాసహ,
మహిషీనవనీతేన సక్షౌద్రం మర్దయేత్ దినమ్. 571
పూర్వవద్ధమనాత్సత్వ మింద్రగోపనిభం భవేత్,

తా. శుద్ధిచేసినవైక్రాంతము ౧ భాగము, బొంతజెముడుగడ్డచూర్ణము ౧భాగము ఇటుల వీని నేకముచేసి బొంతజెముడుపాలతో నొకదినము, గేదెవెన్నతో నొకదినము, తేనెతో నొకదినము మర్దించి బిళ్ళచేసి కోష్టయంత్రమునం దునిచి యూదిన ఇంద్రగోప పురుగులఛాయవలె సత్వము దిగును. (లేక వైక్రాంతము రెండుభాగములు, అభ్రక ద్రావక మొకభాగము-ఇటుల వీని నేకముచేసి మర్దించి బిళ్ళచేసి కోష్టయంత్రమునందునిచి యూదిన సత్వము దిగును.)

## వైక్రాంతగుణము

ఆయుఃప్రదంచ రసబంధకరంచ వృష్యం
వహ్నిప్రదం నిఖిలరోగమదాపహారీ,
దోషత్రయాపనయనం విషదోషహారి
వైక్రాంతకం ఖలు వపుర్బలలోహకారీ. 572

తా. వైక్రాంతము ఆయుర్వృద్ధిని, రసబంధనమును, వీర్యవృద్ధిని, అగ్నిదీపనమును గలుగంజేసి సర్వరోగ త్రిదోష విషదోషముల హరింపంజేయునదిగ, శరీరబలకారిగ, లోహవేధనకారిగ నుండును.

## వైడూర్యనామములు

వైడూర్యం కేతురత్నంచ కైతవం వాలవాయజం,
ప్రావృష్యం భద్రలోహంచ భద్రశబ్దాంకుర స్తథా. 573

తా. వైడూర్యము, కేతురత్నము, కైతవము, వాలవాయజము, ప్రావృష్యము, భద్రలోహము, భద్రశబ్దాంకురము - ఇవి వైడూర్యనామములు.

---

* ఇంద్రగోపపురుగులు అనగా ఆరుద్రపురుగులు.

## వైడూర్యశుద్ధి

వైడూర్యం వాజిమూత్రేణ కూశ్మాండస్వరసేనచ,
భావితం ద్విదినంచాథ శుద్ధిర్భవతి నిశ్చయమ్. 574

తా. వైడూర్యము, గుఱ్ఱపుమూత్రములో నొకదినము, గుమ్మడుపండురసములో నొకదినము నానబెట్టిన శుద్ధియగును.

## వైడూర్యభస్మము

తద్వైడూర్యం శిలాభేదిరసేన పరిభావితం,
విశ్వకర్మపుటే దగ్ధ్వా తీవ్రాగ్నౌ వజ్రమూషయా. 575
తతో గజపుటే పాచ్యం భస్మీభవతి నిశ్చయం,

తా. శుద్ధిచేసిన వైడూర్యములను *పిండికొండవేళ్ళరసముతో భావనజేసి కొలిమిలో నూది వజ్రమూషలో నునిచి దానిపై మఱియొకమూసను మూసి చీలమన్ను లేపనము జేసి గజపుటం బిడిన వైడూర్యము భస్మంబగును.

## వైడూర్యభస్మగుణము

వైడూర్యం వజ్రతుల్యంతు సర్వరోగాన్వ్యపోహతి. 576

తా. వైడూర్యము వజ్రతుల్యముగ, సర్వరోగములహరింపజేయునదిగనుండును.

## నీలశుద్ధి

ఖరమూత్రాంతరే క్షిప్త్వా నీలం తీవ్రాతపే క్షిపేత్,
భావితం దినమేకంచ నీలం శుద్ధం భవిష్యతి. 577

తా. నీలముల గాడిదెమూత్రములోవైచి యొకదినము తీక్ష్ణమైనయెండన భావనజేసిన శుద్ధియగును

## నీలభస్మము

తన్నీలం లకుచం జీవాద్రవే భావ్యం త్రియామకం,
విశ్వకర్మపుటే దగ్ధ్వా భస్మీభవతి తత్క్షణాత్. 578

తా. శుద్ధిచేసిన నీలముల అక్షిపంజాకురసములో మూడుఝాములు నానబెట్టి వజ్రమూషలోపోసి కొలిమిలోనునిచి యూదిన తత్క్షణమున నీలములు భస్మంబగును.

## నీలగుణము

నీలం శీతం గురు స్నిగ్ధం మధురం పిత్తనాశనమ్. 579

* ఇదే పింఢిబంధ యనియు చెప్పంబడును.

తా. నీలము శీతలముగ, జడముగ, స్నిగ్ధముగ, మధురముగ, పిత్తనాశనకారిగ నుండును.

### పుష్పరాగశుద్ధి

పుష్పరాగం ఛాగమూత్రై ర్భావ్యం శుద్ధం భవిష్యతి,
తత్పుష్పరాగం పాషాణభేదిద్రావేణ భావితమ్. 580
విశ్వాకర్మపుటే దగ్ధ్వా భస్మీభవతి తత్క్షణాత్,

తా. పుష్పరాగముల మేకపంచితమునందు నొకదినము నానబెట్టిన శుద్ధియగును. శుద్ధిజేయఁబడిన పుష్పరాగముల కొన్నునదిందిఁ పాషాణభేదిరసముతో భావనజేసి మూకుళ్ళలో నునిచి చీలమన్నునిచ్చి కొలిమిలో నూదిన తత్క్షణమున భస్మంబగును.

### పుష్పరాగగుణము

పుష్పరాగం పుష్టికరం శ్లేష్మలం గురు శీతలమ్. 581

తా. పుష్పరాగము పుష్టికారిగ, శ్లేష్మకారిగ, జడముగ, శీతలకారిగ నుండును.

### మరకతనామములు

స్మృతో జాత్యా మరకతో రౌహిణేయోఽనురక్తకం,
హరిన్మణిశ్చ సౌవర్ణం బుధరత్నాంశుకధ్వజమ్. 582
గరళాయుర్వాయువశం గురుదం రుద్రసమ్మతం, (నిఘంటౌ)

తా. మరకతము, రౌహిణేయము, అనురక్తము, హరిన్మణి, సౌవర్ణము, బుధరత్నము, అంశుకధ్వజము, గరళాయువు, వాయువశము, గురుదము, రుద్రసమ్మతము అనునవి మరకతనామంబులు.

### మరకతశుద్ధి

క్షిప్త్వా విదారికం దాంతఃపుటే కౌక్కుటసంజ్ఞికే. 583
పాచితంచాథ తం నీత్వా భవే న్మరకతం శుచిః,

తా. పచ్చలను తొలిచిన నేలగుమ్మడిగడ్డలో నునిచి దానిపై చీలమన్నువేసి కుక్కుటపుటంబిడి సాంగశీతలమునదీసిన శుద్ధియగును.

### మరకతభస్మము

తతో మరకతం తుద్రారసేన పరికల్పయేత్. 584
పాషాణభేదిద్రావేణ మర్దితంచ శరావకే,
పుటమేకం తతః పాచ్యం భస్మీభవతి తద్ధ్రువమ్. 585

తా. శుద్ధిచేసినపచ్చల ప్రాసదురసములో భావనజేసి కొండపిండివేళ్ళరసముతో నూర్దించి బిళ్ళజేసి యెండించి మూకుళ్ళతో నునిచి చీలమన్నుపూసి గజపుటంబిడిన భస్మంబగును.

## మరకతగుణము

హారితం విశదం కాంతం లఘు గ్రాహి త్రిదోషజిత్. 586

తా. పచ్చలు పరిశుద్ధముగ, మనోహరముగ, లఘువుగ, మలబద్ధకారిగ, త్రిదోషములను బోకడచునదిగ నుండును.

## గోమేధికశుద్ధి

తతో గోమేధికం వాజిమూత్రే భావ్యం దినత్రయం,
తతో విదారిస్వరసే భావ్యం శుద్ధిర్భవిష్యతి. 587

తా. గోమేధికమును గుఱ్ఱపుమూత్రములో మూడుదినములు నానబెట్టి పిదప నేలగుమ్ముడుగడ్డరసములో నానబెట్టిన శుద్ధియగును.

## గోమేధికభస్మము

శుద్ధగోమేధికం కృష్ణధుత్తూరద్రావ భావితం,
విశ్వకర్మపుటే దగ్ధ్వా త్రివారం భస్మచాప్నుయాత్. 588

తా. శుద్ధిజేసిన గోమేధికముల నల్లయుమ్మెత్తాకురసములో మూడుమార్లు* భావనజేసి కొలిమిలో నునిచి యూదిన భస్మంబగును.

## గోమేధికభస్మగుణము

గోమేధికం కఫహారం దీపనం బలవర్ధనం,

తా. గోమేధికము కఫమును హరింపజేయుటయేగాక అగ్నిదీపనమును బలమును గలుగంజేయును.

## ప్రవాళనామములు

ప్రవాళోఽంగారకమణి ర్విద్రుమో బోధిపల్లవః (నిఘంటౌ) 589

తా. ప్రవాళము, అంగారకమణి, విద్రుమము, బోధిపల్లవము అనునవి ప్రవాళ నామంబులు.

## ప్రవాళశుద్ధి

జంబీరనీరాంతరేణభావితం యామమాత్రకం,
ఉష్ణోదకే క్షాళయిత్వా శుద్ధం భవతి విద్రుమమ్. 590

* భావన యన నానబెట్టుటః

తా. పగడముల నిమ్మపండ్లరసములో నొకదినము నానబెట్టి యుష్ణోదకములో కడిగిన శుద్ధియగును.

ప్రవాళభస్మము

తద్విద్రుమం రవిక్షీరై ర్భావితం దినసత్రయం,
ఏవం గజపుటే పాచ్యం భస్మీభవతి నిశ్చయాత్. 591

తా. శుద్ధిచేసినపగడములను జిల్లేడుపాలలో మూడుదినములు నానబెట్టి మూకుళ్లలోబోసి చీలమన్నులిచ్చి గజపుటంబిడిన తత్క్షణమున భస్మమగును.

ప్రవాళగుణము

ప్రవాళంరక్తపిత్తఘ్నం రక్తాతీసారనాశనం,
ప్రదరం రక్తశూలఘ్నం గ్రాహీ పైత్తవినాశనమ్. 592

తా. పగడము రక్తపిత్త, రక్తాతిసార, ప్రదర, రక్తశూల పైత్యరోగముల హరింపం జేయుటయేగాక మలబద్ధకారిగనుండును. (పగడభస్మములో మామిడిచెక్కరసము, మూడు నూనెబొట్లు కలిపి సేవించిన రక్తకుసుమములును, ఆరెచెక్కరసము, పంచదార, జీలకఱ్ఱ కలిపి సేవించిన రక్తకుసుమములును, చింతచిగురురసము, ఏనుమిరియములచూర్ణము కలిపి సేవించిన తెల్లచీరెలును, ఆరెచెక్కరసముగలిపిసేవించిన తెల్లచీరెలును హరించును. పథ్యము చెప్పిడి.)

రోగానుక్రమణిక

ఆమదోష జ్వరే చాతిసారేచ గ్రహణీకృశే,
క్రిమిదోషే రక్తపిత్తేఽసృగ్దరే కామిలా హలీ. 593
పాండురోగే క్షయే గుల్మే జఠరార్శాంసి విద్రధిః,
మూత్రకృఛ్రాశ్మరీ మేహే వృద్ధ్యాశ్మపుష్యపదంశకే. 594
శ్వాసకాసేచ హిక్కాయాం ఛర్ద్యా తృష్ణా హృదామయే,
శూలోదావర్త ఆనాహే మారుతే వాతశోణితమ్. 595
కుష్ఠే విసర్పి శోథేచ శ్లీపదేచ మదాత్యయే,
తున్యశ్లీలక సోమేచ కర్ణనాసా గళస్ఫుటే. 596
ముఖరోగే శిరోరోగే నయనామయకే వ్రణే,
వ్రణేచ విధిథేచైవ భగందరగదే తథా.

గ్రంథ్యర్బుదగదే క్షుద్రే స్ఫోటకే గుహ్యకే గదే,
వంధ్యాదోషే గర్భదోషే గర్భిణీ సకలామయే. 598
ఆమోదరే ప్లీహరోగే స్థౌల్యరోగేచ మర్కటీ,
విషూచ్యాం వహ్నిమాంద్యే చాజీర్ణే వై కాయదోషజే. 599
జ్వరాశ్చ సప్తదోషాశ్చ సన్నిపాతా స్త్రయోదశ,
సూతికా బాలరోగాణా మున్మాదాపస్మృతా వపి. 600
మద మూర్ఛా గ్రహగదే సన్న్యాసకగదేపిచ,
ఇంద్రలుప్తే వలీరోగే ఛాయారోగే ఫిరంగికే 601
స్వరభంగామయే లూతే చామ్లపిత్తగదేపిచ,
తథావరణపైత్తేచ విశ్వే భుజగదంశనే. 602
మూషకాది విషాద్రోగే కృత్రిమాకృత్రిమే విషే,
చికిత్సాశ్చాపి పథ్యాని బీజపాషాణ హేతుకే. 603
పరిపాక స్సర్వరోగే పథ్యాపథ్యం చికిత్సితం,
రసలోహవిధిర్యత్ర రోగవర్గో యథాక్రమమ్. 604
అసాధ్యసాధ్యరోగాశ్చ ప్రోక్తా స్తత్వం న సంశయః,
శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః 605
అవోచం వృషరాజీయ మహం వైద్యశిఖామణిః,
పంచవింశ త్ప్రకరణై ర్యుక్తం విద్వన్మనోహరమ్. 606
కలౌ హితకరం నృణాం సర్వరోగనివారకమ్.

తా. ఆమాతిసారము, జ్వరాతిసారము, అతిసారము, గ్రహణి, కార్శ్యరోగము, కృమిరోగము, రక్తపిత్తము, అస్లగ్దరము, కామిల, హాలీమకము, పాండువు, క్షయము, గుల్మము, జఠరరోగము, ఆర్శస్సు,విద్రధి, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి ప్రమేహము, వృద్ధి రోగము, ఉపదంశము, శ్వాసము, కాసము, మొదలగుశ్లేష్మరోగములు, ఎక్కిళ్ళు, ఛర్ది, తృష్ణ, హృద్రోగము, శూల, ఉదావర్తము, ఆనాహము, వాతరోగము, రక్తవాతము, కుష్ఠువు, విసర్పి, శోఫ, శ్లీపదము, మదాత్యయము, తుని, ప్రతితుని, అష్ఠీలా, ప్రత్యష్ఠీలా, సోమరోగము, కర్ణరోగము, నాసారోగము, గండమాల (గళరోగము), ముఖరోగము, శిరోరోగము, నేత్రరోగము, మండి, ఓెక్కమండి, వదనదౌర్గంధ్యము, దంతరోగము, చనుమాదలు, జంతుకవ్రణము, మురికిసొన్నారి, నూతిపుండు, కరపాదరోగము, అస్థిస్రావము, మొదలగు నానావ్రణములు, భగందరము, గ్రంథి, అర్బుదము, క్షుద్రరోగము, కాలస్ఫోట, విషస్ఫోటకములు, ఆస్యస్ఫోటకము, గుహ్యరోగము, వంధ్యాదోషము, గర్భదోషము, గర్భిణీరోగములు, ఆమరోగము, ఉదరము, ప్లీహము (జల్లకూ

# ఆంధ్ర వచన గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| [illegible], ద్వాదశ స్కంధములు, ఒకే సంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము— | | |
| ,, ఆదిసభాపర్వములు | 4 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 4 | 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 4 | 0 |
| ,, భీష్మద్రోణపర్వములు | 6 | 0 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 4 | 0 |
| ,, శాంతిపర్వము | 6 | 0 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 6 | 0 |
| ఆంధ్రవచనవాల్మీకి రామాయణము, 2 సంపుటములు (అచ్చు) | | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 3 | 0 |
| [illegible] | 3 | 0 |
| శ్రీగురజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 6 | 0 |
| [illegible]కథలు | 2 | 0 |
| స్వీయ[illegible]ప్రహసనము | 0 | 8 |
| తులసీదాసు రామాయణము | 12 | 0 |
| [illegible]గారి[illegible]కేసు, ఉపన్యాసములు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు, వచనం. అచ్చు | | |
| [illegible], 1 భా॥ | 1 | 0 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 12 |
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | 10 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 12 |
| పంచతంత్రము, వచనము | 0 | 12 |
| [illegible]భక్తులచరిత్ర | 2 | 8 |
| [illegible]రత్నాకరము | 0 | 12 |
| సంగ్రహభారతము | 2 | 4 |
| సంగ్రహభాగవతము | 2 | 0 |
| సంగ్రహరామాయణము | 1 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు | 3 | 0 |
| పతివ్రతలచరిత్రలు | 2 | 8 |
| [illegible]పూర్వకథలు | 2 | 8 |
| భోజునికథలు | 0 | 12 |
| హితోపదేశము, సులభశైలి | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, 1 భా॥ | 1 | 0 |
| ,, 2 భా॥ | 0 | 12 |
| తెనాలి రామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| తెనాలి రామలింగం: A. S. P. అయ్యరు విరచితము | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు | 2 | 0 |
| దశకుమారచరిత్రము | 1 | [illegible] |

